# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం
















గురు త్రైలింగ స్వామి

గురు లాహిరి మహాశయ

గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద

గురు సాయి బాబా

గురు అరవిందో

గురు రమణ మహర్షి

గురు యోగానంద

గురు భక్తివేదాంత ప్రభుపాద

గురు మళయాళస్వామి

గురు విద్యాప్రకాశానందగిరి

గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# స్ఫూర్తి

స్వామి వివేకానంద



రామకృష్ణ మఠం
దోమలగూడ,
హైదరాబాదు–500 029.

# విజ్ఞప్తి

ఈ చిన్న పుస్తకంలో స్వామి వివేకానంద మహోపన్యాసలనుండి, రచనల నుండి ఆయన జీవిత చరిత్ర నుండి ఎంపిక చేసి, సంకలనం చేసిన స్ఫూర్తి దాయక భావనలు చోటుచేసుకొన్నాయి. యువ తరానికి ఈ భావనలు స్ఫూర్తినిచ్చి వారి భవితకు చక్కని బాటను రూపొందించగలవని మేం విశ్వ సిస్తున్నాం.

ఈ పుస్తకాన్ని అంకిత భావంతో అనుసృజన చేసిన స్వామి అచింత్యానందకు కృతజ్ఞతాభినందనలు.

— **ప్రకాశకులు**

# విశ్వాసం, బలం

1. మీరు భగవంతుని బిడ్డలు, అమృతసంతానం, పావనులు, పరిపూర్ణులు. మీరు భూమిపైని దేవతలు - పాపులా? మనిషిని పాపి అనడం పాతకం; మానవ నైజం మీద చేసిన నిందాలేఖనం అది. ఓ సింహసదృశులారా! గొర్రెలమనే భ్రాంతిని మీరు విదిలించి వేయండి. మీరు అమృతజీవులు, ముక్తాత్మలు, శాశ్వతానందమయులు; మీరు జడప్రకృతి కాదు; శరీరాలు కారు; ప్రకృతి(పంచభూతాత్మకమైన శరీరాలు; త్రిగుణాత్మకమైన మనస్సు) మీ దాసురాలు; అంతేగాని ప్రకృతికి మీరు దాసులు కారు.

2. ఆత్మవిశ్వాసంలేని వ్యక్తి నాస్తికుడు. భగవంతుని పట్ల నమ్మకంలేని వ్యక్తిని నాస్తికుడని ప్రాచీన మతాల నిర్వచనం. తనపై తనకు నమ్మకం లేని వ్యక్తి నాస్తికుడని ఆధునిక మతం వక్కాణిస్తున్నది.

3. విశ్వాసం; విశ్వాసం; మన పట్ల మనకు విశ్వాసం, భగవంతుని పట్ల విశ్వాసం - మహత్వానికి ఇదే మూల సూత్రం. మన ముప్పై మూడు కోట్ల పౌరాణిక దేవతలపైనా, విదేశీయులు పరిచయం చేస్తూ వచ్చిన దేవీదేవతలపైనా మీకు నమ్మకం ఉన్నా - ఆత్మవిశ్వాసం లేకపోతే మీకు నిష్కృతి ఉండదు. ఆత్మవిశ్వాసం కలిగి ఉండి దానిని ఆధారం చేసుకొని బలిష్ఠులుకండి.

4. విజయాన్ని సాధించాలంటే అద్భుతమైన పట్టుదల, సంకల్పశక్తి మీకుండాలి. పట్టుదల గల వ్యక్తి, "నేనీ సముద్రాన్నే ఆపోశన పట్టగలను. నా సంకల్ప మాత్రంచే కొండలు పగిలి ముక్కలైపోతాయి" అంటాడు. ఆ రకమైన శక్తీ, సంకల్పమూ కలిగి ఉండండి; కష్టపడి పనిచేయండి, గమ్యాన్ని తప్పకుండా మీరు చేరతారు.

5. ఒక మహత్తర యథార్థం ఇది: బలమే(దేహబలం, బుద్ధిబలం, ఆత్మబలం) జీవం, బలహీనతే మరణం. బలమే సంతోషం, బలమే శాశ్వతజీవనం; బలమే అమృతత్వం; బలహీనత ఎడతెగని ప్రయాస, దుఃఖం; దుర్బలతే మరణం.

6. లోకానికి ధైర్యవంతులైన వందల మంది స్త్రీ, పురుషులు అవసరం. సత్యాన్ని తెలుసుకునే సాహసాన్ని ; జీవితపరమార్థాన్ని తెలిపే సాహసాన్ని కలిగిఉండండి;

సాహసం-మృత్యువుకు చలించని సాహసం, మృత్యువును ఆహ్వానించగలిగే సాహసం, మనిషి తనను తాను ఆత్మగా గుర్తించగలిగే సాహసం, ప్రపంచంలో ఏ శక్తీ తనను నాశనం చేయలేదని చెప్పగలిగే స్థైర్యం... అప్పుడే మీరు ముక్తులవుతారు.

7. పనిచేయడం మంచిదే కాని దానికి మూలం ఆలోచనే కదా.... కనుక మీ మనుస్సును ఉత్తమమైన తలంపులతో, అత్యున్నతాలైన ఆదర్శాలతో నింపుకొని, రేయింబవళ్లు వాటిని ధ్యానించండి. తత్ఫలితంగా ఘన కార్యాలు నిర్వర్తింపబడతాయి.

8. లోకంలో నెలకొని ఉన్న దుష్టత్వం గురించి, పాపాల గురించి మాట్లాడకండి. ఇంకా దుష్టత్వం కానవస్తు న్నందుకు విలపించండి. సర్వత్రా పాపం కళ్లబడుతున్నందుకు దుఃఖించండి. లోకోపకారం చేయగోరితే లోకాన్ని తూలనాడనవసరం లేదు. అలా ఖండించి సమాజాన్ని ఇంకా బలహీనం చేయకండి. పాపం, దుఃఖం ఇత్యాదులన్నీ ఏమిటి? బలహీనత ఫలితాలే! దౌర్బల్యం యొక్క ఫలితాలే! ఇలాంటి బోధనలచే లోకం రోజురోజుకీ బలహీనమవుతోంది.

9. అభ్యుదయప్రదాలైన, బలప్రదాలైన, సహకారప్రదా లైన భావనలు చిన్ననాటినుంచీ వారి(భవిష్యత్‌తరాలు)

మెదళ్లలో ప్రవేశించుగాక! మీరూ అలాంటి భావనలనే పొందండి; బలహీనపరచే, అశక్తులను చేసే వాటిని దరి చేరనీయకండి.

10. అపజయాలను లక్ష్య పెట్టకండి. అవి సహజం, అవి జీవితానికి అందం చేకూరుస్తాయి. అవి లేని జీవితం ఎలా ఉంటుంది? ఈ పోరాటాలే జీవితానికి స్వారస్యమిచ్చేవి. అవి లేకుంటే జీవిత కవితామాధుర్యం ఎక్కడుంటుంది? ఈ పోరాటాలనూ, పొరపాట్లనూ లక్ష్యపెట్టవద్దు. ఆవు అసత్యమాడదు. నిజమే, కాని అది ఎప్పటికీ ఆవే, మనిషి కాజాలదు. కనుక అపజయాలచే నిరుత్సాహం చెందకండి. ఆదర్శాన్ని చేగొని వేయిసార్లు ప్రయత్నించండి. వేయిసార్లు ఓటమి చవిచూసినా ఇంకోసారి ప్రయత్నించండి.

11. విశ్వంలోని సర్వశక్తులూ మనలోనే ఉన్నాయి. స్వయంగా మన కళ్లను మనమే చేతులతో మూసుకొని చీకటిగా ఉందని విలపిస్తున్నాం. మనలను చీకటి ఆవరించలేదని గ్రహించండి. చేతులను తొలగించి వేయండి. ప్రారంభం నుంచే ఉన్న వెలుగు గోచరిస్తుంది. ఎన్నడూ చీకటి లేదు, దుర్బలత లేదు. మనమే వెర్రివాళ్లమై దుర్బలురమని వాపోతున్నాం; మనమే మూర్ఖులమై అపవిత్రులమని విలపిస్తున్నాం.

12. బలహీనతకు పరిష్కారం దానిని గురించి చింతన చేయడం కానే కాదు; బలాన్ని గురించి ఆలోచించడమే అందుకు ప్రతిక్రియ. మనుష్యులలో నిబిడీకృతమై ఉన్న బలాన్ని గూర్చి వారికి బోధించండి.

13. మనపై మనకు విశ్వాసాన్ని చేకూర్చే ఆదర్శం, మనకు అత్యంత ప్రయోజనకరం. మనం అంతకన్నా అధికంగా ఆత్మవిశ్వాసాన్ని గూర్చి నేర్చి దానిని ఆచరణలో చూపించి ఉంటే, మనం ప్రస్తుతం అనుభవిస్తున్న అనర్థాలూ, దుఃఖాలూ దాదాపు మటుమాయమైపోయేవి.

14. మానవ చరిత్ర నంతటినీ పరికిస్తే, ఘనకార్యాలు చేసిన స్త్రీ పురుషుల జీవితాల్లో అన్నింటికన్నా ఎక్కువగా సామర్థ్యాన్ని ఇచ్చిన మూలశక్తి, వారి ఆత్మవిశ్వాసమే అని తెలుస్తుంది. తాము ఘనులమనే విశ్వాసంతో వారు జన్మిం చారు, ఘనులే అయ్యారు.

15. ఒక మనిషి అతిహీనస్థితికి దిగజారిపోయాడను కోండి. కొంతకాలానికి అతడే నిరాశానిస్పృహల కారణంగా తన దుస్థితి నుండి ఊర్ధ్వగమనాన్ని సాగించి ఆత్మవిశ్వాసం అలవరచుకొని తీరతాడు. కాని మొదటినుండి దానిని గుర్తించడం మంచిది. ఆత్మవిశ్వాసం ప్రాప్తించుకోవడం కోసం ఇన్ని చేదు అనుభవాలను చవిచూడడం ఎందుకు?

16. ఒక మనిషికీ మరో మనిషికీ మధ్య గల తారతమ్యం ఆత్మవిశ్వాసం ఉండడం, ఆత్మవిశ్వాసం లేకపోవడం అనే భేదం వలన కలుగుతుందని మనం గుర్తించవచ్చు. ఆత్మ విశ్వాసం అన్నింటినీ సాధించగలదు. నా జీవితంలో నాకది అనుభవానికి వచ్చింది; ఇంకా అనుభవిస్తున్నాను. నేను పెద్ద వాడనయిన కొద్దీ ఆ విశ్వాసం ఇంకా బలపడుతోంది.

17. నీ శరీరంలో ఎన్ని శక్తులు, ఎన్ని సమర్థతలు, ఎన్ని మహిమలు దాగున్నాయో నీకు తెలుసా? మనిషిలో ఉన్న సర్వమూ తెలిసిన శాస్త్రవేత్త ఎవడున్నాడు? మానవుడు ఈ లోకంలో అవతరించి కోట్ల సంవత్సరాలు గడిచాయి. అయినా ఆతడి శక్తులలో అణుమాత్రమే ఇప్పటికి బహిర్గత మయింది. కనుక 'నేను దుర్బలుణ్ణి' అనకూడదు. పైపైన కానవచ్చే అధఃకరణం అడుగున మరుగుపడి ఎంత మహత్వం అణగివుందో నీ కెలా తెలుస్తుంది? నీలో అణగివున్న మహత్వాన్ని గూర్చి నీకు తెలిసింది అత్యల్పం. నీ వెనుక అనంత శక్తి సముద్రం ఉంది.

18. జడపదార్థం శక్తిసమన్వితమైతే, ఆలోచన సర్వశక్తి సమన్వితం. ఈ విశ్వాసం మీ జీవితాలలో చోటుచేసుకోనీ! మీ సర్వశక్తిని గూర్చిన, మీ ఘనతను గూర్చిన, మీ మహిమ లను గూర్చిన భావనతో నిండి ఉండండి. మూఢవిశ్వాసా

లేవీ మీ మనస్సులోకి ఎక్కకుండా ఉంటే ఎంత బాగుండేది! చైతన్యాన్ని హరించే క్షుద్రత్వ, దుర్బలత్వాది మూఢవిశ్వాసాలు మనలను ఆజన్మాంతం ఆవరించకుండా ఉంటే ఎంత బాగుండేది!

19. ఏక జీవకణం (అమీబా) నుండి మానవ రూపాన్ని పొందేవరకూ, వెనక్కి తిరిగి నీ దశాంతరాలను చూసుకో! అదంతా ఎవరు చేశారు? నీ స్వీయ సంకల్పమే కదా! నీ సంకల్పం సర్వశక్తిమంతం కాదని ఇంకా అంటావా? నిన్నింత ఉన్నతికి తెచ్చిన శక్తి, ఇంకా నిన్ను ఉద్ధరించగలుగుతుంది. సంకల్పశక్తిని బలపరిచే శీలం నీకు అవసరం.

20. ఆగ్నేయాస్త్రంలా రివ్వున వచ్చిపడి, అజ్ఞానరాసుల నంతా భస్మీపటలం చేసే మహాశక్తిని ఉపనిషత్తులు నిర్భ యత్వం అని పేర్కొంటున్నాయి. మీరు బాగా ప్రచారం చేయ వలసిన ఏకైక మతధర్మం నిర్భయత్వమే! వ్యావహారిక ప్రపంచంలోగాని, ఆధ్యాత్మిక ప్రపంచంలోగాని 'భయ'మనేది మన పతనానికి, పాపానికి మూలకారణమనడం సత్యం. దుఃఖాన్ని కలిగించేది 'భయం'; దౌష్ట్యాన్ని పెంచేది 'భయం', మరణాన్ని తెచ్చేది 'భయం'.

21. మీ నాడులను దృఢతరం చేసుకోండి. ఇనుప నాడులు, ఉక్కు కండరాలు మనకు అవసరం. మనం ఎంతో

కాలం విలపించాం. ఇక విలపించడం మానండి, లేచి మీ పాదాలపై నిలబడి, ధీరులు కండి.

22. మన యువకులు బలిష్ఠులు కావాలి. మత నిష్ఠ ఆ తరువాత దానంతట అదే చేకూరుతుంది. ముఖ్యంగా నా యువమిత్రులకు నేను చేసే విజ్ఞప్తి ఇది: ముందు బలిష్ఠులు కండి. బలహీనులై ఉండి భగవద్గీతా పారాయణంకన్నా 'ఫుట్‌బాల్' ఆటే మిమ్మల్ని త్వరగా మోక్షమార్గానికి తీసుకొనిపోతుంది. ఇవి మహాసాహస వచనాలు సుమా! అయినా మీపట్ల నాకు గాఢాభిమానం ఉండడం వలన వాటిని చెప్పక తప్పదు. నా చెప్పు ఎక్కడ కరుస్తుందో నాకు తెలుసు. నేను కొంచెం అనుభవాన్ని గడించాను. మీ జబ్బలు, మీ కండరాలు ఇంకా కొంత బలపడినప్పుడు మీరింకా బాగా గీతను అర్థం చేసుకోగలుగుతారు. మీలో ఇంకా కొంచెం బలముంటే, రక్తం ప్రవహిస్తే శ్రీకృష్ణుని మహాబలాన్ని, ప్రతిభావిశేషాన్ని చక్కగా అర్థం చేసుకోగలుగుతారు. మీ పాదాల మీద మీ శరీరం దృఢంగా, సుస్థిరంగా నిలబడి నప్పుడు మీరు నిజమైన పురుషులమని భావించగలిగినప్పుడు ఉపనిషత్తులను, ఆత్మ మహిమను సమగ్రంగా గ్రహించ గలుగుతారు.

23. ఇప్పుడు కావలసింది 'పురుషులు' మాత్రమే, తక్కినదంతా సిద్ధంగా సమకూరుతుంది. కాని బలిష్ఠులు, జవ

సంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మవిశ్వాసపరులు అయిన యువకులు కావలసి ఉన్నారు. అలాంటి వారు నూరుమంది లభిస్తే, ప్రపంచం యావత్తు పరివర్తనం చెందుతుంది.

24. సంకల్పశక్తి తక్కిన శక్తులన్నింటికన్నా బలవత్తర మయింది. అది సాక్షాత్తూ భగవంతుని నుంచి వచ్చేది కాబట్టి దాని ముందు తక్కినదంతా వీగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన సంకల్పం సర్వశక్తిమంతమైనది. దానిపై నీకు విశ్వాసం లేదా?

25. అవును, నేను పరిణతి చెందుతున్న కొద్దీ అంతా పురుషప్రయత్నంలోనే ఉన్నట్లు తెలుస్తోంది. చెడును చేసినా 'మనిషి'గా, ధైర్యంగా చేయండి. నువ్వు దుష్టుడవ వలసివస్తే, మహాదుష్టునిగా ఉండు.

26. ఆత్మవిశ్వాసం ఉన్న కొందరి చరిత్రే ప్రపంచ చరిత్ర. ఆ విశ్వాసం వ్యక్తిలోని దివ్యత్వాన్ని బహిర్గతం చేస్తుంది.



# ప్రేమ, స్వార్థరాహిత్యం

1. స్వార్థరాహిత్యమే విశేష లాభదాయకం; కాని దానిని అలవరచుకొనే ఓర్పు ప్రజలకు లేదు.

2. ఏదో ఉన్నతస్థానంలో కూర్చుని ఐదు పైసలు చేతబుచ్చుకొని, "ఏమోయ్, పేదవాడా, ఇదుగో" అనవద్దు. దానమిచ్చి నువ్వు మేలు పొందడానికి అతడొకడు ఉన్నందుకు ఆతడి పట్ల కృతజ్ఞుడవై ఉండు. ధన్యత దాతకేగాని దానం పుచ్చుకొన్న వ్యక్తికి కాదు. నీ ఔదార్యాన్ని, నీ దయాగుణాన్ని లోకంలో అమలుపరచి తద్వారా నువ్వు పవిత్రుడవై, పరిపూర్ణ తను సంతరించుకోవడానికి నీకు అవకాశం లభించి నందుకు కృతజ్ఞుడవవు.

3. ఇతరులకు మేలు చేయాలనే నిరంతర ప్రయత్నంచే మనలను మనం మరచిపోవడానికి ప్రయత్నిస్తూన్నాం. ఇలా మనలను మనం మరచిపోవడమే జీవితంలో నేర్చుకోదగిన గొప్ప గుణపాఠం. అవివేకంతో మనిషి తనను తాను ఆనందమయుణ్ణిగా చేసుకోగలనని భావిస్తాడు. కాని అనేక

సంవత్సరాలు కొట్టుమిట్టాడి చివరికి స్వార్థాన్ని చంపుకోవడమే నిజమైన సౌఖ్యమనీ, తన సౌఖ్యం తన చేతిలో ఉన్నదేగాని ఇతరుల చేతుల్లో లేదనీ గ్రహిస్తాడు.

4. ఏది స్వార్థపరమో అదే అవినీతి; స్వార్థరహితమైనదేదో అదే నీతి.

5. జీవితమంతా ఇవ్వడమే అని తెలుసుకో. జీవితమంటే త్యాగమే; పరోపకారమే; స్వచ్ఛందంగా మనం దాతృత్వం అలవరచుకోకపోతే ప్రకృతే బలవంతంగా మన చేత త్యాగం చేయిస్తుంది. కనుక ఇష్టపూర్వకంగానే ఇచ్చివేయాలి... కూడబెట్టటమే మన స్వభావం అయి ఉంటుంది. భల్లూకపు పట్టుతో మనం ఏదో తీసుకువెళదామనుకుంటాము. కాని ప్రకృతి నీ గొంతు పట్టుకొని నీ పిడికిలి తెరిపిస్తుంది. నీకు ఇష్టమైనా, కష్టమైనా నువ్వు త్యాగం చేయవలసిందే. 'నే నివ్వను' అన్న మరుక్షణమే నీపై దెబ్బపడుతుంది. నువ్వు గాయపడతావు. చివరికి తన సర్వస్వాన్నీ త్యాగం చేయాల్సిన నిర్బంధస్థితికి గురికాని వ్యక్తి ఎవరూ ఉండరు.

6. పవిత్రంగా ఉంటూ ఇతరులకు మేలు చేయడమే అన్ని ఉపాసనల సారం. దరిద్రునిలో, రోగిలో శివుణ్ణి చూడగలిగిన వ్యక్తి నిజమైన శివారాధకుడు. విగ్రహంలో మాత్రమే

శివుణ్ణి చూడగలిగే వ్యక్తి ఆరాధన ప్రారంభ దశలోనిదే.

7. స్వార్థరహిత ప్రవృత్తే మతానికి గీటురాయి. ఇలాంటి నిస్వార్థత ఎవరిలో ఎంత అధికంగా ఉంటుందో ఆతడు అంత ఆధ్యాత్మికపరుడూ, శివసాన్నిధ్యం పొందిన వాడూ అవుతాడు... కాని స్వార్థపరుడైన మనిషి సమస్త దేవాలయాలను దర్శిస్తూ అన్ని తీర్థాలను సేవిస్తూ చిరుత పులిలా శరీరమంతా నామాలు ధరించినా శివునికి చాలా దూరంగానే ఉంటాడు.

8. ప్రేమ; ప్రేమను మాత్రమే నేను ప్రబోధిస్తాను. విశ్వాత్మ అభిన్నత్వాన్ని, సర్వవ్యాపకత్వాన్ని ప్రతిపాదించే వేదాంత సత్యాన్ని ఆధారంచేసుకొని ప్రబోధం సాగిస్తాను.

9. మొదట ఆహారం తరువాతే మతం. పేదవారు తిండిలేక మలమలమాడుతూంటే వారికి మితిమీరిన మత బోధ చేయమంటారే? మత సిద్ధాంతాలు వారి ఆకలి బాధను తీర్చగలవా?... నువ్వు లక్షలకొద్దీ సిద్ధాంతాలను గూర్చి ప్రసంగాలు చేయవచ్చు. కోట్లకొద్దీ సంప్రదాయాలను బయలు దేరదీయవచ్చు. కాని నీ హృదయం స్పందించేటంత దాకా అదంతా వ్యర్థమే. వేదం బోధిస్తూన్నట్లు వారు నీలో కలిసి పోయి, నీ శరీరాంగాలలో వారు చేరిపోయేటంత వరకూ నువ్వూ, వారూ పేదలూ ధనికులూ, పండితులూ పామరులూ,

సాధువులూ పాపులూ అందరూ బ్రహ్మమని పేర్కొనే ఆ అద్వితీయ అఖండ పరమాత్మ యొక్క వివిధ రూపాలని , అంశలని గ్రహించే వరకు నీ హృదయాన్ని స్పందించనివ్వు.

10. దుస్థితిలో ఉన్నవారి కోసం పరితపించి సహాయానికై ఎదురుచూస్తే, అది వచ్చే తీరుతుంది. ఈ భారాన్ని నా హృదయంలో మోస్తూ, ఈ భావాన్ని నా మనస్సులో నిలుపుకొని నేను పన్నెండేళ్లు పయనించాను. ధనవంతులనబడే, ఘనులనబడే వారి ఇంటింటికీ నేను వెళ్లాను. రక్తం స్రవిస్తున్న హృదయంతో ప్రపంచంలో సగం భాగాన్ని దాటి ఈ అన్య దేశానికి (అమెరికా) సహాయార్థం వచ్చాను. భగవంతుడు మహిమాన్వితుడు. ఆయన సహాయం చేస్తాడని నాకు తెలుసు. ఈ దేశంలో చలిని లేదా ఆకలిని తట్టుకోలేక నేను నశించిపోవచ్చు. కాని యువకులారా పేదల, అజ్ఞానుల, పీడితుల పట్ల చూపవలసిన సానుభూతిని మీకు సంక్రమింపచేస్తున్నాను.

11. ఈ జీవితం క్షణికమైనది, లోకంలోని ఆడంబరాలు అశాశ్వతం. కాని ఇతరుల నిమిత్తం జీవించే వారు మాత్రమే శాశ్వతంగా జీవిస్తారు; తక్కినవారు కేవలం జీవచ్ఛవాలు.

12. వితంతువు కన్నీరు తుడవలేని, ఒక అనాథ నోట ముద్ద అన్నం పెట్టలేని మతంపట్లగాని లేదా దేవుని పట్లగాని నాకు నమ్మకం లేదు.

13. నాయనా! ప్రేమకు ఎన్నటికీ అపజయం లేదు; నేడో, రేపో లేదా యుగాల తదనంతరమో సత్యం జయించే తీరుతుంది. ప్రేమ విజయాన్ని సాధిస్తుంది. నీ తోటివారిని నువ్వు ప్రేమించగలవా?

14. భగవంతుణ్ణి ఎక్కడకు వెళ్లి వెతకుతావు? పేదలూ, దీనులూ, దుర్బలులూ అందరూ దేవుళ్లు కారా? వారినెందుకు ఆరాధించకూడదు? గంగాతీరంలో బావిని ఎందుకు తవ్వాలి?

15. సర్వశక్తిమంతమైన ప్రేమశక్తిని నమ్ము... నీలో ప్రేమ ఉందా? నువ్వు సర్వశక్తిమంతుడివి. నీలో పరిపూర్ణ స్వార్థరాహిత్యం ఉండే పక్షంలో నీకు తిరుగులేదు. సర్వత్రా జయించేది శీలమే!

16. నా అనుభూతిని వ్యక్తంచేయలేనంతగా నా హృదయం నిండి ఉంది. దానిని మీరు ఊహించుకోవచ్చు. లక్షలమంది ఆకలి, అజ్ఞానంతో అలమటిస్తూ జీవించినంత కాలం, వారి శ్రమ ఫలితంగా విద్యావంతులై, వారి పట్ల అలక్ష్యం వహిస్తున్న ప్రతి ఒక్కరినీ నేను ద్రోహిగా పరిగణి స్తాను. పేదలను పిప్పిచేసి ఆర్జించిన ధనంతో విలాసవంతమైన జీవితం గడుపుతూ – ఆకలిగొన్న ఆటవికులకన్నా మెరుగైన స్థితిలో లేని కోట్లమంది సోదర ప్రజానీకానికి ఏమీ చేయలేనంత దాకా– నేను ఆ విద్యాధికులను, ధనవంతులను

తుచ్ఛులని పేర్కొంటాను. నా సోదరులారా! మనం పేదలం, అనామకులం. కాని అత్యున్నత స్థితిలోని వారికి సదా అవే పరికరాలైనాయి.

17. నేను ముక్తిని లేదా భక్తిని లెక్కచేయను. ఊటనీటిలా (నిశ్శబ్దంగా)పరులకు హితం చేస్తాను."

18. మరణపర్యంతం నేను ఎడతెగక పనిచేస్తాను, మరణానంతరం సైతం లోకశ్రేయస్సుకై పనిచేస్తాను. అసత్యం కన్నా సత్యం శక్తివంతమైనది; మంచితనం కూడా అంతే. నువ్వు వీటిని కనుక సంతరించుకోగలిగితే స్వాభావికమైన ప్రబలశక్తిచే అవి అడ్డంకులను అధిగమించి మార్గాన్ని సుగమం చేస్తాయి.

19. వ్యాకోచమే జీవనం, సంకోచమే మరణం. యావత్తు ప్రేమ వ్యాకోచం, యావత్తు స్వార్థం సంకోచం. కనుక ప్రేమ మాత్రమే ఏకైక జీవన ధర్మం. ప్రేమించే వ్యక్తి జీవిస్తాడు, స్వార్థపరుడు మరణిస్తాడు. ఏకైక జీవనధర్మం ప్రేమ కనుక మనం జీవించిడం కోసం శ్వాసిస్తున్నట్లు ప్రేమకోసమే ప్రేమించాలి. ప్రేమఫలం ప్రేమే.

20. ప్రపంచానికి వెలుగునిచ్చే దెవరు? పూర్వం త్యాగమే జీవితధర్మంగా అలరారింది; త్యాగమే జీవన విధానమైంది. ఇది పునరావృతమయ్యేసరికి కొన్ని యుగాలు

గడుస్తాయి. అనేకుల హితం కోసమూ సర్వుల సంక్షేమం కోసమూ లోకంలోని అతిసాహసవంతులూ, సర్వోత్తములూ త్యాగంచేయాలి. అనంత ప్రేమ, కరుణలు గల బుద్ధదేవుళ్లు వందలకొద్దీ అవసరమై ఉన్నారు.

21. నేను మళ్లీమళ్లీ జన్మించి వేలకొలది కష్టాలను అనుభవిస్తాను గాక! తద్వారా ఉనికి గల, నేను నమ్మే ఏకైక దేవుణ్ణి సర్వాత్మకుణ్ణి ఆరాధిస్తాను; అన్నింటికీ మించి అన్ని జాతుల, వర్గాలలోని దుష్టుల, నికృష్టుల, పేదవారైన నా దేవుణ్ణి ప్రత్యేకంగా ఆరాధిస్తాను.

22. మనలో స్వార్థపరమైన ఆలోచన సమసి పోయినప్పుడు మన ద్వారా చక్కటి పని నిర్వహణకు నోచుకుంటుంది, మన మహత్వ ప్రభావం ఇతరులపై ప్రసరిస్తుంది.

23. ప్రపంచంలోని మతాలు నిర్జీవమై జవసత్వాలు కోల్పోయి అపహాస్య పూరకమైనవి. లోకానికి కావలసింది శీలం. ఎవరి జీవితం ప్రజ్వలించే ప్రేమతో, నిస్వార్థమయమై ఉంటుందో అలాంటి వారే లోకానికి అవసరం. ఆ ప్రేమ వారు పలికే ప్రతి పదాన్నీ పిడుగులా ధ్వనింపచేస్తుంది.

24. అత్యున్నత విశ్వధర్మం ఆత్మత్యాగమేగాని

స్వాతిశయం కాదు.

25. మహోన్నతమైన ఆత్మత్యాగం మూలంగానే ధర్మ పరాయణత జనిస్తుంది. నీ కోసం ఏదీ కాంక్షించవద్దు. సమస్తం ఇతరుల కోసమే చేయి. భగవంతునిలో ఉంటూ జీవించడమూ చరించడమూ అంటే ఇదే.

26. ఎవరూ నాశనమొందరు. ఎవరూ అసంపూర్ణులుగా మిగిలిపోరు. "పురోగమించండి నా సోదరులారా! మీరు అనంత పావనసింధువులు! దైవంగా అభివ్యక్తమవండి, దైవమే అవండి!" అంటూ రేయింబవళ్లు పలుకండి.



# భగవంతుడు, మతం

1. ప్రతి జీవిలో దివ్యత్వం గర్భితమై ఉంది. బాహ్యాంతర ప్రకృతినంతా నిరోధించి అంతర్గతమై ఉన్న నీ దివ్యత్వాన్ని అభివ్యక్తం చేయడమే జీవిత పరమావధి. ఇందుకై కర్మ, ఉపాసన, యోగ, జ్ఞాన మార్గాలలో ఒక్కటిగాని, రెండు గాని, అన్నింటినీగాని అవలంబించి ముక్తులవండి. మత సారాంశం ఇదే. వాదాలు, సిద్ధాంతాలు, రాద్ధాంతాలు కర్మకలాపాలు, గ్రంథాలు, దేవాలయాలు, విగ్రహాలు - ఇవన్నీ అప్రధాన విషయాలు.

2. భగవంతుడు ఒకరు ఉన్నారంటారా, అయితే మనం ఆయనను చూడాలి; ఆత్మ ఉందంటారా, అయితే దానిని మనం అనుభూతి చెందాలి. లేకపోతే నమ్మ కుండా ఉండడమే మేలు. ఆస్తికుడనే ముసుగు వేసుకోవడం కన్నా బాహాటంగా నాస్తికుడు కావడమే మంచిది.

3. సాధన తప్పక చేయాలి. ప్రతి రోజూ వేళకు వచ్చి మీరంతా నా మాటలు శ్రద్ధగా వినవచ్చు. కాని సాధన

అనుష్ఠించకపోతే మీరు ఒక్క అడుగు కూడా ముందుకు పోలేరు. అంతా అభ్యాసం మీదే ఆధారపడి ఉంది. అనుభవం కలుగనిదే మనం ఎన్నటికీ ఈ విషయాలు అవగతం చేసుకోలేం. వాటిని స్వానుభవంతో మనం కనుగొనవలసి ఉంటుంది. కేవలం పూర్వపక్ష సిద్ధాంతాలనూ వివరణలనూ వింటే లాభం లేదు.

4. ఒక భావన స్వీకరించండి. ఆ ఆలోచననే మీ ఊపిరిగా చేసుకోండి. దానినే మననం చేయండి, దానినే కలగనండి. దాన్లోనే తన్మయులై జీవించండి. మీ మెదడు, కండరాలు, నరాలు, శరీరంలోని ప్రతి భాగమూ ఆ భావనతో తన్మయం చెందాలి. ఇదే కార్య సిద్ధికి దారి. ఈ విధానమే అలౌకిక గుణాఢ్యులైన ఆధ్యాత్మిక మహాత్ములను ప్రభవింపచేసింది.

5. ఈ ప్రవక్తలు అద్వితీయులు కారు, వారు కూడా మనలాంటి మనుషులే. అయితే వారు గొప్ప యోగులుగా రూపొందారు. అతీంద్రియజ్ఞానం వారికి సిద్ధిస్తే, మనకూ అది సిద్ధిస్తుంది. వారేమీ అసాధారణ వ్యక్తులు కారు. ఒక వ్యక్తి ఆ స్థితి పొందాడంటేనే, ప్రతి వ్యక్తీ దానిని పొందవచ్చని తేలుతుంది. పొందవచ్చని కాదు, పొంది తీరాలి. అతీంద్రియ జ్ఞానాన్ని సిద్ధించుకోవడమే మతం.

6. పరిపూర్ణ స్వతంత్రుణ్ణి, ప్రకృతి నియామకుణ్ణే మనం భగవంతుడని పేర్కొంటున్నాం. బంధ విముక్తి అనే భావనలేక మీరు చరించలేరు, వసించలేరు కాబట్టి మీరు ఆయనను నిరాకరించలేరు.

7. ఏ ప్రాణికీ వైఫల్యం వాటిల్లదు. జగత్తులో వైఫల్య మనేదే లేదు. మనిషి నూరు పర్యాయాలు తనకు తాను హాని చేసుకోవచ్చుగాక! వేయిసార్లు పతనమొందవచ్చుగాక! కాని చివరికి తాను అఖండ సచ్చిదానందబ్రహ్మమే అని తెలుసుకుంటాడు.

8. మతం సిద్ధాంతాలలోనూ, రాద్ధాంతాలలోనూ, ప్రజ్ఞావాదాలలోనూ లేదు. మతం అంటే మన నిజస్థితే, మన పరిణతే. మతమంటే స్వస్వరూప అనుసంధానమే; సాక్షాత్కారానుభవమే.

9. ఏసుక్రీస్తు సూక్తులను జ్ఞాపకం చేసుకోండి: "అడిగితే లభిస్తుంది, అన్వేషిస్తే కనుగొంటావు; తలుపులు తడితే తెరచుకుంటాయి." ఈ వచనాలు అలంకారాలు కావు, కల్పనలు కావు, అక్షర సత్యాలు.

10. బాహ్యతర ప్రకృతిని(ప్రాపంచిక సుఖాలతో కూడిన ఇంద్రియజగత్తు) జయించడం ముమ్మాటికీ ఘనకార్యమే!

కాని మన అంతర ప్రకృతిని జయించడం ఇంకా గొప్ప కార్యం... ఈ అంతరంగంలోని మనిషిని జయించడం, మనిషి మనస్సులో ఉండే సూక్ష్మతర చర్యల రహస్యాలను అవగతం చేసుకోవడం పూర్తిగా మతానికి మాత్రమే చెందుతుంది.

11. జీవంలోనూ మరణంలోనూ, సుఖంలోనూ దుఃఖంలోనూ దైవం సమంగా నిలిచి ఉంటాడు. జగత్తంతా భగవన్మయం. కళ్ళు తెరిచి ఆయనను దర్శించండి.

12. భగవంతుణ్ణి ఆరాధించడంలో మనం సదా మనలో దాగి ఉండే ఆత్మనే ఆరాధిస్తూ ఉంటాం.

13. అపరోక్షానుభూతి పొందవచ్చు. నువ్వందుకు సిద్ధమా? నీకది కావాలా? కావాలంటే లభిస్తుంది. అప్పుడు నీది నిజంగా ధర్మసందీప్త జీవనమవుతుంది. నువ్వు అప రోక్షానుభూతి పొందే దాకా నీకూ నాస్తికులకూ తేడా లేదు. నాస్తికులు నిష్కపటులు; కాని మతంపట్ల నమ్మకం ఉందని చెబుతూ దానిని అనుభూతం చేసుకోవడానికి ఎన్నడూ ప్రయత్నించని వ్యక్తి కపటి.

14. ఇంతవరకు ఉన్న మతాల నన్నింటినీ నేను అంగీ కరించి, ఆయా మతావలంబు లందరితోనూ కలసి నేనూ భగవదారాధన చేస్తాను. వారు ఏఏ రీతుల్లో అర్చిస్తారో నేనూ

ఆయా రీతుల్లో అర్చిస్తాను. మహమ్మదీయుని మసీదుకు వెళతాను. క్రైస్తవుని చర్చికి వెళ్లి శిలువ మ్రోల మోకరిల్లుతాను. బౌద్ధాలయానికి వెళ్లి బుద్ధుణ్ణీ, ఆయన ధర్మాలను శరణ మర్థిస్తాను. ప్రతి వ్యక్తి హృదయంలోనూ ప్రకాశిస్తున్న దివ్య జ్యోతిని వీక్షించ ప్రయత్నించే హిందువులతో కూడి తపస్సు చేయడానికి అరణ్యాలకు వెళతాను.

15. భారతదేశంలో *యోగం* (ఐక్యం) అనబడే దాని మూలంగా అలాంటి ఆదర్శమతం సిద్ధిస్తుంది. కార్యతత్ప రుడికి ఈ యోగం అంటే మానవునికి మానవాళికీ ఐక్యత, యోగికి జీవాత్మ పరమాత్మల అనుసంధానం. భక్తుడికి తనకూ ప్రేమమయుడైన ఈశ్వరుడికి సాయుజ్యం. వేదాంతికి అస్తిత్వం యొక్క ఏకత్వం. యోగం అంటే ఇదే.

16. ఇప్పుడు అసలు ప్రశ్నకు వద్దాం: మతం వలన నిజంగా ఏమైనా ప్రయోజనం ఉందా? ఉంది. అది మానవు డికి అమృత జీవనాన్ని ప్రసాదిస్తుంది. మానవుణ్ణి ప్రస్తుత స్థితికి తీసుకువచ్చింది అదే; మతం ఇంకా ఈ మానవ పశువును దేవుణ్ణిగా కూడా చేస్తుంది. మతం మాత్రమే చేయగల పని అది. మానవ సమాజం నుంచి మతాన్ని తీసివేయండి. మిగిలేదేమిటి? పశుస్వభావంతో నిండిన వ్యక్తుల అరణ్యమే!

17. నీకు ఎవరు సాయం చేస్తారు? నువ్వే లోకానికి సహాయం చేసేవాడివి. ఈ విశ్వంలో నీకు సాయపడగలిగిన దేది? నీకు సాయపడగల మానవుడుగాని, దానవుడుగాని, దేవుడుగాని ఏడీ? నిన్ను లొంగదీయ గలిగినదేది? నువ్వే జగదీశ్వరుడవు. నువ్వు ఎక్కడ సాయం కోసం అన్వేషిస్తావు? నీలో నుంచి కాక వేరెక్కడ నుండి సాయం ఎన్నడూ రాలేదు. నువ్వు చేసిన ప్రార్థన ఫలించినప్పుడల్లా, మరెవరో ఫలింప జేసినట్లు అజ్ఞానంలో నువ్వు భావించావు. నీకు తెలియదుగాని నీ ప్రార్థనను ఫలింపజేసుకొన్నది నువ్వే.

18. గ్రంథ అధ్యయనం వలన మనం పారమార్థిక సహాయం పొందుతున్నామని కొన్ని సమయాల్లో భ్రమి స్తూంటాం. కాని గ్రంథాధ్యయనం వలన మనకు కలిగే ప్రతి ఫలాన్ని పరికిస్తే చివరికి దాని వలన కాస్తో కూస్తో లాభం పొందడం కేవలం మన ధీశక్తికి కలుగుతోంది. కాని అంత రాత్మకు కలుగడంలేదని మనకు వెల్లడి అవుతుంది. ఆధ్యాత్మిక విషయాలను గురించి దాదాపుగా ప్రతి వ్యక్తీ అత్యద్భుతంగా మాట్లాడగలిగీ, అనుష్ఠానానికి–నిజమైన పారమార్థికాచరణకి – వచ్చేసరికి ఎంత శోచనీయంగా వెనుకబడి ఉంటామో మనం ఎరుగనిది కాదు. ఈ వ్యత్యాసానికి కారణం గ్రంథాధ్య యనం ఆత్మవికాసాన్ని పెంపొందింపచేయకపోవడమే అని చెబుతాను. ఆత్మజ్యోతిని ఉద్దీప్తం చేయాలంటే తగిన ప్రేరణ

శక్తి మరొక ఆత్మనుంచి ప్రసరించి తీరాలి.

19. భగవంతు డొక్కడే సత్యం, ఆత్మ ఒక్కటే నిత్యం, ఆధ్యాత్మికతే శాశ్వతం. వాటిని వదలక పట్టుకొని ఉండండి.

20. ప్రపంచంలోని విభిన్న మతాలు, అవి అవలంబించే ఆరాధనా విధానాలనుబట్టి వేర్వేరుగా తోస్తున్నప్పటికీ, నిజానికి అవన్నీ ఒక్కటే!

21. ధ్యానమే అసలు విషయం. ధ్యానించడమే మహత్త్వమైన విషయం. ధ్యానంలో లయించిన మనస్సు ఆధ్యాత్మిక జీవితానికి అత్యంత సమీప మార్గాన్ని ఆవిష్కరిస్తుంది. నిత్యజీవితంలో ఆ సమయంలోనే మనం భౌతికవాదులంగా మెలగం; భౌతికమైన యావత్తునుండి విడివడి ఆత్మను గురించి ఆలోచించే ఆ తరుణం అద్భుతమైనది.

22. లోకసేవా ధురంధరులనబడే వారందరికన్నా భగవంతుడికి పూర్తిగా ఆత్మార్పణం చేసుకొన్న వారే విశేష లోక కల్యాణ కారకులు. పరిపూర్ణమైన ఆత్మశుద్ధిని పొందిన ఒక్క వ్యక్తి ప్రబోధకుల పటాలం కన్నా అధికంగా కార్యాన్ని సాధిస్తున్నాడు. పవిత్రత, మౌనం- వీటి నుంచే అమోఘ వాక్కు వెలువడుతుంది.

23. భగవంతుడు ఉన్నాడనీ, ఆయనను ఇహంలోనే ఇక్కడే చూడగలమనీ తెలుసుకోవడమే మనకు ఇప్పుడు

కావలసింది.

24. "అన్నం, అన్నం" అనడానికీ అన్నాన్ని తినడానికీ ఎంతో తేడా ఉంది. "నీరు, నీరు" అనడానికీ నీటిని తాగడానికీ ఎంతో వ్యత్యాసం ఉంది. ఇలాగే "దేవుడు, దేవుడు" అని పదేపదే ఉచ్ఛరించినంత మాత్రాన సాక్షాత్కారం పొందలేం. తీవ్ర ప్రయత్నం చేయాలి, సాధన చేయాలి.

25. భయాందోళనలు కల్పించే చెడుల మధ్య నా ఆపద్బాంధవా! అని పలుకు. మరణ బాధలలో నా ఆర్తత్రాయ పరాయణా! అని పిలువు. లోకంలోని చెడులన్నింటి మధ్య నా దీనజన బాంధవా! నువ్వు ఇక్కడ ఉన్నావు, నిన్ను నేను చూస్తున్నాను. 'నువ్వు నాతోనే ఉన్నావని నాకు తోస్తున్నది, నేను నీకు చెందినవాణ్ణి, నన్ను స్వీకరించు. లోకానికి చెందిన వాణ్ణి కాను, నేను నీ వాణ్ణి నన్ను వదలిపెట్టకు.' అంటూ ఆర్తిగా అర్థించు! వజ్రాల గనిని వదలి గాజుపూసల వెంట పరుగెత్తకు. ఈ జీవితం ఒక గొప్ప అవకాశం. లోక సుఖాలను కాంక్షిస్తున్నావా ఏమిటి? ఆయన (భగవంతుడు) పరమానందానికి ఆలవాలం. అత్యున్నతమైన దానిని కాంక్షించు, అత్యున్నతమైన దానిని లక్ష్యం చేసుకో, నువ్వు తప్పక అత్యున్నత స్థితిని చేరుకొంటావు.

26. మనం వివేకవంతులం, ఉత్సాహవంతులం కావాలి. శోకపూరితమైన ముఖాలు ధర్మపరాయణతను సాధించలేవు. ధర్మపరాయణత ఉత్కృష్టమైనది కనుక అది ప్రపంచంలో అత్యంత ఆనందమయమైనదై ఉండాలి.

27. ప్రతి వస్తువునీ భగవంతునిగా ఉపాసించు, ప్రతి రూపమూ ఆయన ఆలయమే. తక్కినదంతా భ్రమే. చూపును సదా లోపలికే సారించు, బయటికి కాదు. వేదాంతం బోధించే భగవంతుడు ఇలాంటి వాడు; ఆయన ఉపాసనా విధానం ఇలాంటిది.



# భారతదేశం

1. ఈ లోకం మన మాతృదేశానికి ఎంతో ఋణపడి ఉంది. ప్రపంచదేశాల చరిత్రలను ఒక్కటొక్కటిగా పరిశీలిస్తే మానవాళి సహనశీలి, సాధుమూర్తి అయిన హైందవునకు ఋణపడి ఉన్నంతగా మరే జాతికీ ఋణపడలేదని వెల్లడవుతుంది.

2. అనేకులకు మొదటి చూపులో భారతీయ భావనలన్నా, భారతీయ పద్ధతులన్నా, భారతీయ సంప్రదాయాలన్నా, భారతీయ వేదాంతమన్నా, భారతీయ వాఙ్మయమన్నా వెగటుగానే ఉంటుంది. కాని వారు ఓపికపట్టి, మన గ్రంథాలు చదవాలి. మన భావనలకు మూలాధారాలైన మహాసూత్రాలను పరిచయం చేసుకోవాలి. అప్పుడు నూటికి తొంభై తొమ్మిది మందిపై ఈ సమ్మోహనశక్తి చక్కగా ప్రసరిస్తుంది. తత్ఫలితం పారవశ్యమే!

3. నేను పెరిగి పెద్దవాడినైనకొద్దీ భారతదేశంలోని ఈ ప్రాచీన ఆచారాలపై నాకు గౌరవభావం కలుగుతోంది.

ఒకప్పుడు నేను వాటిలో చాలా ఆచారాలు నీచమైనవనీ, నిష్ప్రయోజనమనీ భావించాను. కాని కాలం గడచేకొద్దీ వాటిలో దేనినిగాని నిందించడానికి జంకుతున్నాను. ఎందుకంటే వాటిలోని ప్రతిదాన్లో శతాబ్దాలకొద్దీ గడించిన అనుభవం ఇమిడి ఉంది కనుక.

4. ఇతర దేశాల్లో ప్రగల్భాలు పలికేవారు చాలామంది ఉన్నారు. కాని మతానుష్ఠానపరులైన, ఆధ్యాత్మికతను తమ జీవితాల్లో చాటిచెప్పిన వారిని ఇక్కడే, ఈ దేశంలో మాత్రమే చూడగలం.

5. మనం ప్రపంచానికి బోధించవలసింది కొంత ఉందని చెప్పాను. ఈ కారణంగానే, ఈ ఈశ్వరేచ్ఛ వల్లనే మన జాతికి శతాబ్దాల పర్యంతం మహోపద్రవాలు వాటిల్లినా, దాదాపు వేయి సంవత్సరాలుగా పరదేశీయుల పాలనలో క్రుంగినా, ఈ మన జాతి ఇంకా సజీవంగా నిలిచి ఉంది. దీనికి చావు లేదు. ఇది అమరం. ఇది భగవంతుని పట్ల ప్రపత్తి కలిగి మతధర్మానికీ, ఆధ్యాత్మిక జ్ఞానానికీ పుట్టినిల్లుగా విరాజిల్లడమే ఇందుకు కారణం.

6. పాశ్చాత్య జాతులూ, ఇతర జాతులు కూడా ఇప్పుడు మితిమీరిన రాజ్యాధికార వాంఛలతో, సాంఘిక కుతంత్రాలతో విసిగివేసారి సగం చచ్చి అధోగతిలో పడివున్నాయి.

ఆ జాతులకు ప్రాణంపోసి, నూతనోజ్జీవం కల్పించగల మహాశక్తి, ప్రపంచమంతటా వెల్లువలై ప్రవహించాల్సిన మత ధర్మాల, సత్యాత్మతత్త్వాల మూలశక్తి ,ఇక్కడే ఉంది.

7. కాని నా మాటలను గుర్తుపెట్టుకోండి; ఆధ్యాత్మిక తను జారవిడిచారంటే, దానిని త్రోసిరాజని పాశ్చాత్యుల ప్రాపంచిక నాగరకత వెంటబడ్డారంటే, దాని ఫలితార్థంగా మూడు తరాలలో మీ జాతి వినాశం చెందుతుంది. మీ జాతీయ భవంతి పునాదులు సడలిపోయి మీ జాతి సర్వ నాశనమవుతుంది.

8. ఐరోపా ఖండం తన స్థితిని మార్చుకొని తన ప్రస్తుత సంప్రదాయాన్ని కూడ మార్చుకొని తన జీవితానికి ఆధ్యాత్మిక ధర్మాన్ని పునాదిగా చేసికోవడానికి ప్రయత్నించక పోతే ఇంకో యాభై సంవత్సరాలలో ముక్కలుముక్కలై దుమ్ములో కలిసిపోతుంది. మన ఉపనిషత్తులు ప్రతిపాదించే ఆస్తికధర్మం ఒక్కటి మాత్రమే ఐరోపాను నేటి దుస్థితి నుంచి ఉద్ధరించగలదు.

9. మన పూర్వులలో ఉత్తమ కులీనులు ఇతర సామాన్య జనులను కాలద్రొక్కి నేలరాచారు; వారిని దిక్కులేని వారినిగా చేశారు. ఈ హింసల వలన ఆ నిర్భాగ్యులు తాము మనుష్యులమనే మాటే దాదాపుగా మరిచిపోయారు.

ఇలా అనేక శతాబ్దాల కాలం గతిలేక వారు కట్టెలుకొట్టీ, నీళ్లుమోసీ, చెప్పులుకుట్టీ, కూలీనాలీ చేసుకొనీ ఎలాగో బ్రతుకులు వెళ్లదీశారు. తాము సేవకులుగా, బానిసలుగా జన్మించామని భావించి వారు అలాగే దుర్భర దారిద్ర్యాన్నీ, అవమానాన్నీ భరిస్తూ కాలం గడిపారు.

10. ఉపనిషత్తులు బోధించిన ధర్మాలు మీ ముందే ఉన్నాయి. వాటిని చేపట్టండి. వాటిని అనుసరించి జీవించండి. అప్పుడు భారతదేశం మోక్షం పొందే కాలం రాగలదు.

11. దేవతల, ఋషుల సంతానంలో లక్షలకొద్దీ జనం నేడు పశుప్రాయులైపోయారేనని మీరు నిజంగా బాధపడు తున్నారా? లక్షలాది జనం తిండిలేక ఈనాడు మలమల మాడుతున్నారే అని గానీ, తిండిలేక కోట్లకొద్దీ జనం అనేక యుగాలనుండి చచ్చిపోతున్నారనిగానీ మీరు దుఃఖిస్తున్నారా? అజ్ఞానం కారుమబ్బులా క్రమ్మివేసిందని మీరు ఆరాటపడు తున్నారా? అది మీ హృదయాలను కలచివేస్తున్నదా? మీకు నిద్రపట్టకుండా చేస్తోందా? అది మీ రక్తంలో ప్రవేశించిందా? మీ గుండె దానితో స్పందిస్తోందా? ఆ విచారంలో మీరు పిచ్చివారైపోతున్నారా? ఈ విధంగా అయ్యో! సర్వం నాశనమై పోయింది గదా అనే చింత మిమ్మావహించిందా? మీ పేరు ప్రతిష్ఠలను, మీ ఆలుబిడ్డలను, ఆస్తిపాస్తులను, శరీర సౌఖ్యా లను అన్నింటినీ మీరు మరచిపోయారా? నిజం చెప్పండి.

అలా మీరు చేయగలిగితే దేశభక్తులు కావడానికి మీరు మొదటి మెట్టును ఎక్కారన్నమాట!

12. రండి, మానవులవండి! మీ సంకుచిత బొరియల నుంచి బయటకు వచ్చి నలువైపులా చూడండి. వివిధ జాతులూ ఎలా ముందంజవేస్తున్నాయో చూడండి. సోదర మానవుణ్ణి మీరు ప్రేమిస్తారా? స్వదేశాన్ని మీరు ప్రేమిస్తారా? ప్రేమిస్తే రండి. ఉన్నత పరిస్థితులకై యోగ్యతర స్థితిగతులకై నడుం బిగించండి. వెనక్కి తిరక్కండి.

13. భారతదేశం పట్ల నాకు ఎంత ప్రేమ ఉన్నా, నేనెంతటి దేశభక్తుణ్ణి అయినప్పటికీ, మన పూర్వుల పట్ల నా కెంతటి పూజ్యభావమున్నాకూడా, ఇతర జాతుల నుండి మనం అనేక విషయాలు నేర్చుకోవలసి ఉన్నామని నేను చెప్పక తప్పదు... బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా మనకు జరుగదు. అలా జరుగగలదని ఇన్నాళ్లూ మూఢులమై భావించాం. అందుకు ప్రాయశ్చిత్తంగా వేయేళ్లు బానిసత్వం అనుభవించాం. మనం బయటికిపోయి మన అనుభవాలను ఇతరుల అనుభవాలతో పోల్చి చూసుకొనకపోవడం, మన చుట్టూ ఏం జరుగుతోందో గుర్తించకుండా ఉండడం, మన బుద్ధి భ్రష్టమైపోవడానికి గొప్ప కారణం. అందుకు శిక్షను అనుభవించాం. ఇక ఎన్నడూ అలా చేయమని లెంపలేసి కొందాం.

14. దక్షిణ భారతదేశంలోని ప్రాచీన దేవాలయాలు, గుజరాత్‌లోని సోమనాథ్ వంటి దేవాలయాలు విజ్ఞాన సంపుటాలను మీకు అందిస్తాయి. అనేక పుస్తకరాసుల కన్నా ఇవి మీ జాతీయ చరిత్ర రహస్యాలను ఎక్కువ స్పష్టంగా మీకు తెలుపగలవు. నిరంతరం వందలకొద్దీ పర్యాయాలు జవసత్వాలతో పునర్జీవితమై పైకి లేస్తూ వచ్చిన గుర్తులు ఆ దేవాలయాల మీద ఎలా కనిపిస్తున్నాయో చూడండి! మన జాతీయ హృదయం ఆ విధంగా ఉంది. మన జాతీయ జీవన స్రవంతి ఆ తీరుగా ప్రవహిస్తోంది.

15. రాబోయే యాభై సంవత్సరాల వరకు ఈ మన దివ్య భారతమాతే, మన అధిష్ఠానదేవతగా ఉండుగాక! అంత వరకు ఇతర వ్యర్థ దేవతలు, మన మనస్సుల నుండి అదృశ్యమైపోతారుగాక! ఈమె ఒక్కతే జాగ్రదావస్థలో ఉండవలసిన ప్రధాన దేవత! మూర్తీభవించిన మన జాతి స్వరూపం. సర్వత్రా ఆమె చేతులే, సర్వత్రా ఆమె పాదాలే, సర్వత్రా ఆమె కర్ణాలే. ఆమె అన్నింటిని ఆవేశించి ఉండుగాక! తక్కిన దేవతల నందరినీ నిద్రపోనివ్వండి. వ్యర్థ దేవతల వెంటబడి మన చుట్టూ ఆవరించి ప్రకాశించే దేవతను, ఈ విరాణ్మూర్తిని పూజింపజాలకున్నామే? ఈ దేవతను మనం పూజిస్తే తక్కిన దేవతల నందరినీ పూజించడానికి అర్హుల మవుతాం.

16. మన దేశ పారమార్థిక, లౌకిక విద్యలను మన వశంలో ఉంచుకోవాలి. అంటే మీకు అర్థమయిందా?... ఇప్పుడు మీరు నేర్చుకొంటున్న విద్యలో కొన్ని మంచి లక్షణాలున్నాయి. కాని మహానర్థాలు కూడా అనేకం లేకపో లేదు. అవి దాని ద్వారా కలిగే మేలును దిగమింగేటంత తీవ్రమైనవి. మొదటి సంగతి. ఇది మనిషిని రూపొందించే విద్యే కాదు. ఇది పూర్తిగా నిషేధరూపమైన విద్యగా మాత్రమే ఉంది. నిషేధరూప విద్య లేక నిరాకరణాన్ని ఆధారం చేసుకొన్న శిక్షణ మరణంకన్నా నికృష్టం.

17. ఇక్కడికి(పాశ్చాత్య దేశాలకు) రావడానికి ముందు నేను భారతదేశాన్ని ప్రేమించాను. ఇప్పుడు ఆ భారతదేశ ధూళి, గాలి సైతం పరమ పావనమై నాకు కానవస్తోంది. నా దేశం ఇప్పుడు ప్రియతమ యాత్రాస్థలంగా, తీర్థక్షేత్రంగా తోస్తోంది.

18. నువ్వు ఆంగ్లేయునితోనూ, అమెరికన్‌తోనూ సమానుడివి కాదలచుకొంటే నువ్వు నేర్పడమే కాక నేర్చుకో వాలి కూడా. శతాబ్దాల పర్యంతం ఇంకా ప్రపంచానికి నువ్వు బోధించవలసింది ఎంతో ఉంది. ఇది చేసి తీరాలి.

19. భారతదేశ పతనానికి కారణం ప్రాచీనులు

ఏర్పాటు చేసిన శాసనాలు, సంప్రదాయాలు చెడ్డవి కావడం కాదు; సంపూర్ణ పరిశీలన పొంది సక్రమంగా సిద్ధాంతాలు కావడానికి వాటికి అవకాశం లభించకపోవడమే కారణం.

20. మీవద్ద దేశం కోసం తమ సర్వస్వాన్నీ త్యజించడానికి సిద్ధమైన నిజాయతీపరులైన వ్యక్తులు ఉండి, వారు కార్యరంగంలో దూకినప్పుడు భారతదేశం ప్రతి రంగంలోనూ మహత్వాన్ని సంతరించుకొంటుంది. దేశాన్ని రూపొందించే వారు మనుష్యులే!

21. జనసామాన్యాన్ని నిర్లక్ష్యం చేయడమే జాతి పాపంగా నేను పరిగణిస్తాను. మన పతనానికి అదొక కారణం. భారతదేశ జనసామాన్యం విద్యావంతులై, పౌష్టిక ఆహారం స్వీకరించి, బాగా సంరక్షింపబడే వరకు రాజకీయాలు ఎంత నూరిపోసినా ప్రయోజనం మృగ్యమే.

22. "జనసామాన్యం మత భావనలను గాయపరచకుండా వారిని ఉద్ధరించడం." ఈ ఆదర్శాన్నే మీ ముందు ఉంచుకోండి.

23. విద్య, విద్య, విద్య మాత్రమే! ఐరోపాలో ఎన్నో నగరాల గుండా పయనిస్తున్నప్పుడు అక్కడ పేదలు సైతం విద్యావంతులై, సుఖంగా ఉండడం పరికించిన నాకు మన దేశ పేదల స్థితిగతులు స్మృతిపథంలో మెదలి నా కళ్లు

చెమ్మగిల్లాయి. ఈ తేడాకు కారణం ఏమిటి? విద్యే అని నాకు జవాబు లభించింది. విద్య వలన ఆత్మవిశ్వాసం ఏర్పడు తుంది, ఆత్మవిశ్వాసం వలన వారిలో స్వతస్సిద్ధంగా కొలువై ఉన్న బ్రహ్మం జాగృతి చెందుతుంది. కాని మనలోని బ్రహ్మం క్రమంగా నిద్రాణమవుతోంది.

24. నా జీవిత ఏకైక ఆశయం ఏమిటంటే: ఒక యంత్రాంగాన్ని గతిలో ఉంచి తద్వారా ఇంటింటికీ ఉదాత్త భావాలు అందించడం, ఆ తరువాత స్త్రీ పురుషులు తమ విధిని తామే నిర్ణయించుకొంటారుగాక! జీవితంలోని అతి ముఖ్యమైన ప్రశ్నల గురించి మన పూర్వీకులు, ఇతర దేశీయులు ఏం చింతన చేశారో వారు తెలుసుకొంటారు గాక! ప్రత్యేకంగా ఇతరులు ఇప్పుడు ఏంచేస్తున్నారో వారిని చూడనిచ్చి తదుపరి వారిని నిర్ణయించుకోనివ్వండి.

25. భవిష్యత్తు విషయమై నేను ఆలోచించడం లేదు, దానిని ఖాతరు చేయడం లేదు. ఒక్క దివ్యదృశ్యాన్ని, సజీవ దృశ్యాన్ని మాత్రం నేను స్పష్టంగా చూస్తున్నాను. అది ఇది: మన ప్రాచీన జనయిత్రి మళ్లీ మేల్కొంది. ఆమె తన సింహాసనం అధిష్ఠించింది; అపూర్వమైన శోభతో ఉత్తేజిత మైంది. శాంతిస్వరంతో, మంగళ వచనాలతో ఆమెను గూర్చి

జగత్తుకు చాటిచెప్పండి.

26. నా జీవితం నా మాతృదేశ సేవకే అంకితమైంది. నా దేశప్రజలారా! ప్రియమిత్రులారా! నాకు వేయిజన్మలున్నా ఆ జన్మ క్రమంలోని ప్రతిక్షణాన్ని మీ సేవకే అంకితం చేసేవాడిని.



## ఇతర ప్రబోధాలు

1. విద్య అంటే మన మెదడులో చొప్పించబడి అర్థం కాకుండా మన మనస్సుల్ని కలవరపెట్టే సమాచార రాశి కాదు. మనకు  కావలసింది చైతన్యప్రదం, పురుష నిర్మాణకుశలం, శీలనిర్మాణ సమర్థం అయిన భావాలను జీర్ణం చేసుకోగల ప్రబోధమే! మీరు ఐదు భావాలను జీర్ణం చేసుకొని వాటిని, మీ జీవితంలో, మీ శీలంలో భాగంగా చేసుకుంటే, ఒక గ్రంథాన్నంతా కంఠోపాఠంగా వల్లెవేసిన వ్యక్తి కన్నా మీకు ఎక్కువ విద్య అబ్బినట్లే సుమా!

2. నాగరకత అనే వ్యాధి ఉన్నంత వరకు పేదరికం తాండవించి తీరుతుంది. అందుకే సహాయం అవసరమై ఉంది.

3. పాశ్చాత్య ప్రపంచం ధనపిశాచాల నిరంకుశత్వానికి గురియై మూలుగుతోంది; ప్రాచ్య ప్రపంచం పురోహితుల నిరంకుశత్వంలో ఆర్తనాదం చేస్తోంది.

4. పాశ్చాత్య ప్రపంచమంతా నేడో రేపో భగ్గుమని

మంటలు వెలిగ్రక్కనున్న అగ్నిపర్వత ముఖంలో ఉంది. ఎప్పుడైనా అది బ్రద్దలైపోగలదు.

5. నాగరకత బీజాలను ఆసియా నాటింది; ఐరోపా మానవ వికాసానికి దోహదం చేసింది; మహిళల, జన సామాన్య ప్రగతిని అమెరికా కొనసాగిస్తోంది.

6. ప్రతి వ్యక్తీ, ప్రతి దేశమూ మహత్వం పొందగోరితే మూడు విషయాలు ఆవశ్యకమై ఉన్నాయి:

అ. మంచితనంపై దృఢవిశ్వాసం.

ఆ. అసూయ, అనుమానాల రాహిత్యం.

ఇ. సత్కార్యాలు చేయటం, అలా చేయాలని ప్రయత్నించే యావన్మందికీ సహాయపడడం.

7. నీ తోటివారికి నాయకత్వం వహించాలని ప్రయత్నించవద్దు, వారిని సేవించు. నాయకత్వం వహించాలనే పిచ్చి ఆవేశం జీవితం అనే జలరాశిలో అనేక నౌకలను ముంచివేసింది.

8. మన నైజంలో వ్యవస్థీకృత సామర్థ్యం పూర్తిగా మృగ్యం. దానిని మనం వంటబట్టించుకోవాలి. అసూయా రాహిత్యమే గొప్ప రహస్యం. తోటి మానవుల అభిప్రాయాలను అంగీకరించడానికి సదా సిద్ధంగా ఉండండి, నిరంతరం

సయోధ్యకు ప్రయత్నించండి. మొత్తం రహస్యం ఇదే.

9. మీ నుంచి నేను కోరేది ఇదే: మీరు స్వబలసంపదాభివృద్ధిని, ముఠాకట్టడాలను, అసూయను శాశ్వతంగా విడనాడాలి. మీరు భూమాతలా సర్వత్రా సహనం పాటించాలి. మీరు దీనిని సాధిస్తే ప్రపంచం మీ పాదాక్రాంతమవుతుంది.

10. స్త్రీల స్థితిగతులు మెరుగుపడకుండా లోక సంక్షేమం సాధించడానికి ఆస్కారం లేదు. పక్షి ఒంటి రెక్కపై ఎగరడం అసాధ్యం.

11. తమ సమస్యలను తమకు అనుగుణమైన విధానాలలో పరిష్కరించుకునే స్థితికి స్త్రీలను తీసుకురావాలి. వారి కోసం ఎవరూ దీనిని చేయలేరు. ప్రపంచంలోని ఇతర స్త్రీలలా మన భారతీయ మహిళలు దీనిని నిర్వర్తించుకోగల సమర్థులు.

12. సీతను కన్న ఈ జాతికి – ఆమెను కలలో గుర్తుంచుకున్ననూ ప్రపంచంలో మరేజాతికి లేనంత పూజ్యభావం స్త్రీలపై ఉంటుందని నాకు తెలుసు.

13. తమను కీర్తిస్తున్నప్పుడు విని మూర్ఖులు సైతం కార్యశూరులు కాగలుగుతారు; పిరికిపందలు తప్పకుండా తమకు సానుకూలంగా జరుగుతుందని తెలిసినప్పుడు

సాహస వైఖరి అవలంబిస్తారు; కాని నిజమైన వీరుడు నిశ్శబ్దంగా పనిచేస్తాడు. బుద్ధుడు వ్యక్తం కావడానికి మునుపు ఎందరు బుద్ధులు మరణించారో కదా!

14. పాశ్చాత్య దేశాల అద్భుతమైన జాతీయ జీవిత కట్టడాలు శీలం అనే పటిష్టమైన స్తంభాలను ఆధారం చేసుకొని నిర్మితమైనాయి. అలాంటి అనేక కట్టడాలను మనం రూపొందించేటంత వరకు ఈ దేశం లేదా ఆ దేశం మీదా కారాలూ మిరియాలు నూరడం నిష్ప్రయోజనం.

15. యావత్తు పని మీలో ప్రతి ఒక్కరి మీదా ఆధారపడినట్లుగా భావించి పనిచేయండి. యాభై శతాబ్దాలు మిమ్మల్నే చూస్తున్నాయి, భారతదేశ భవిష్యత్తు మీ మీదనే ఆధారపడి ఉంది. పని చేస్తూవుండండి.

16. ఇతరులపై ఆధారపడిన వ్యక్తి సత్యస్వరూపుడైన భగవంతుణ్ని సేవించలేడు.

17. లౌకిక ప్రపంచాన్ని ఖాతరు చేయకుండా అచంచల విశ్వాసంతో భగవంతుణ్ని నమ్మే ఒక సరిక్రొత్త జనబాహుళ్యాన్ని ఇక్కడ సృజించనున్నాను.

18. ప్రతి పనీ మూడు దశలను అతిక్రమించాలి – అపహాస్యం, ప్రతిఘటన, ఆ తరువాత స్వీకారం. దూర

దృష్టితో ఆలోచించే ప్రతి వ్యక్తీ తప్పకుండా అపార్థం చేసుకో బడతాడు.

19.జీవితం పోరాటాల, భ్రమల పరంపర.... జీవిత అంతరార్థం సుఖపడడంలో లేదు, సుఖదుఃఖాల అనుభవాల ద్వారా నేర్చుకోవడంలోనే ఇమిడి ఉంది. కాని నిజంగా నేర్చు కోవడం ప్రారంభించిన క్షణంలోనే మనం విరమిస్తాం.

20. ఈ జగత్తులో మంచికి దారితీసే మార్గం కఠోర మైనది, అమిత ప్రయాసలతో కూడుకున్నది. అనేకులు విజయవంతులవడం ఆశ్చర్యం, అనేకులు అపజయం పొందడంలో ఆశ్చర్యం లేదు. వేయి అడ్డంకులను అతిక్రమించి శీలాన్ని సుప్రతిష్ఠితం చేసుకోవాలి.

21. జననం, మరణం, మంచీ చెడు, జ్ఞానం అజ్ఞానం – వీటి మిశ్రమాన్నే మాయ అంటారు. ఈ వలలో అనంత కాలం ఆనందం కోరుకొంటూ చరించవచ్చు – నువ్వు ఆనందాన్ని కనుగొనవచ్చు, అంతకన్నా అధికంగా చెడుకూడా తారసపడుతుంది. చెడు లేకుండా మంచిని మాత్రమే పొంద దమనకోవడం అర్థరహితం.

22. తనకు నచ్చితే గొప్ప మూర్ఖుడు సైతం ఘనకార్యం సాధించగలడు. కాని వివేకి ప్రతి పనినీ తనకు నచ్చే రీతిలో మలచుకొంటాడు. ఏ పనీ అల్పమైనది కాదు.

23. భవిష్యత్తులో సహాయం అందుతుందని నిరంతరం భావించేవారు మాత్రమే పనిచేయగలరు, ప్రత్యక్షంగా వారు కార్యరంగంలో ఉంటారు.

24. మనం నేర్చుకోవలసిన మొట్టమొదటి పాఠం ఇదే. ఇతరులనెవరినీ నిందించకుండా, ఏ బాహ్యశక్తినీ తప్పుపట్టకుండా ధీరులై నిలిచి మన వైఫల్యాలకు మనమే కారణమని తెలుసుకోవడం. ఇది నిత్యసత్యం. నిగ్రహం కలిగి ఉండు.



## శక్తిమంతమైన ఆలోచనలకు సంబంధించి మీరు తప్పక చదువవలసిన మా కొన్ని ఇతర ప్రచురణలు...

మానసిక శక్తులు

వ్యక్తిత్వ వికాసం

ధ్యాన మార్గదర్శి

దృఢ సంకల్పాలు

ఏకాగ్రతా రహస్యం

సంకల్పశక్తి : దాని వికాసం

ఆలోచనా శక్తి

